(అభినవ)

# సుమతిశతకము

1512
1937

PNo 112
SINo 100

కృతికర్త:
దుర్భా సుబ్రహ్మణ్యశర్మ,
నెల్లూరు.



1937

సర్వస్వామ్యములు గ్రంథకర్తవి] [ వెల ౨ అణాలు.

# ( అభినవ )

# సుమతిశతకము

*Approved for School use.*
*Vide Page 675, of Pt. I, B. Ft. St. George Gazet*
*dated 10—11—31.*

ప్రకాశకులు:
[illegible] సుబ్రహ్మణ్యశాస్త్రి
నెల్లూరు.



1937

[illegible] వెల [illegible] అణాలు.

1931 ప్రథమ ముద్రణము: 2000 ప్రతులు

1932 ద్వితీయ ముద్రణము: 5000 ,,

1934 తృతీయ ముద్రణము: 5000 ,,

1937 చతుర్థ ముద్రణము: 2000 ,,

# విజ్ఞప్తి.

ప్రకృతము బాలురు చదువుచున్న "సుమతీశతకము" లో అశ్లీలములు మెండుగానున్నవి. స్త్రీ స్వభావదూషణము, వేశ్యా గర్హణము, మొదలగు విషయముల గుఱించిన పద్యములును గొన్నికలవు. వీనిం దొలఁగించి శిశుజనోచితముగా 'అభినవ'ముగా నొక్క 'సుమతిశతకము' రచింపుఁడని విద్యార్థి జనోపయోగి గ్రంథముల విషయమునఁ జిరకాలానుభవము కలిగిన విజ్ఞులొకరు కొన్ని యేండ్ల క్రింద నన్నెచ్చరించియుండిరి. కాని యప్పుడు నేను రచనాంతరాభిరతుఁడనై యున్నకతన వారి యిష్టము నెఱవేర్పనేరక పోయితిని. ఇటీవల నొకవిద్వద్గోష్ఠిలో ఈ ప్రసంగము రాఁగా, అందు నామిత్త్రులు కొందఱు అట్టిశతకముయొక్క యావశ్యకత నొక్కి చెప్పుటయే కాక, తద్రచనమునకు నా పద్యములు తద్దయుందగియుండునని నన్నుఁ బెద్దచేసి పలికిరి. వారి యీ పొగడ్తకు ముదితుఁడనయ్యు ఇట్టి క్రొత్తపనికి నాయర్హత యెంతమాత్రమో పరిశీలించుకొనఁ గోరియు, బహు గ్రంథావలోక పూర్వకముగా ఈ శతకము రచించి, వారు కోరినట్లే దీనికి 'అభినవ సుమతి శతకము' అని పేరిడితిని. ఇది చిన్న తరగతులలోఁ జదువు బాలురకొఱకు ఉద్దేశింపఁబడినది కావున, రచనయందు, ప్రౌఢిపైఁగాక సౌలభ్యముపై దృష్టినిడి పద్యము లొకమాఱు చదివినంతనే కంఠస్థము లగుట కనువగునట్లుగా పదగుంభనము పలుమాఱు పరికించి సరిపఱిచితిని. కూర్పు మిగుల బిగువుగా

నున్నదని తోఁచినపట్ల, పాదపూరణముల కొఱక పదబంధము సడలించితిని. అప్పటికిని కష్టములుగానున్న పదముల కర్థము వ్రాసి గ్రంథాంతమునఁ జేర్చితిని. ఇందలి నీతులు విశ్వజనీనములు కావలయుననియు, పద్యములు విద్యార్థులకు ముఖస్థములగుటయేకాక వారి హృదయములయందును జొచ్చి వారిని ముందుముందు సదాచరణమునకుఁ బ్రేరింపవలయు ననియు నాయభిలాషము. విద్యావిధానము నడిపించు నధికారులును, ఒజ్జలును ఈచిఱుకృతి నరసి యిందు గుణలేశమున్న దేశమున దీనికిఁదగిన వ్యాప్తి కలిగింతురు గావుతమని వేఁడుచున్నాఁడను.

---

## రెండవ కూర్పు.

తొలికూర్పు ప్రతులన్నియు నే ననుకొన్న దానికన్న మున్నె వెలపోయినందున, ఇపు డీ రెండవకూర్పు నచ్చొత్తించుచున్నాఁడను. ఒండు రెండు పద్యములు మార్చుటయు, కడపటి పద్యము చేర్చుటయుఁ దక్క ఎక్కువ సవరణ లేమియు నిందుఁ గావింపఁబడియుండ లేదు. ఇది ప్రాథమిక పాఠశాలలలో 'పద్యవాచకము'గా నుండఁదగిన యుత్తమ రచనయని నన్నభినందించుచున్న కవిమిత్రములకును, ఇయ్యాదరణమును క్రియగాఁ బరిణమింపఁజేసి బోర్డుపాఠశాలలలో, మునిసిపల్ స్కూళ్ళలో, వీథిబడులలో, పల్లెకూటములలో, దీనిని పాఠ్యముగా నిర్ణయించుచున్న తత్తదధికారి వర్గమునకును, కృతజ్ఞతాపూర్వకముగా నమస్కృతు లర్పించుచు, తొలికూర్పుపట్లఁబోలె, ఈ రెండవ కూర్పుపట్లను ప్రాజ్ఞ హృదయములు ప్రసన్నము లగుంగావుతమని ప్రార్థించుచున్నాఁడను.

నెల్లూరు
9—6—1932

దుర్భా సుబ్రహ్మణ్యశర్మ,
ప్రధానాంధ్రపండితుఁడు, కళాశాల, నెల్లూరు.

శ్రీ

# అభినవ సుమతి శతకము.

క. శ్రీదంబులు, భవపాశ
చ్ఛేదంబులు, సకలభక్త ♦ చిత్తాంబురుహా
మోదంబులు, పరమేశ్వరు
పాదంబులు కొలుచువాఁడు ♦ ప్రాజ్ఞుఁడు; సుమతీ!. 1

క. ఇల క్రుంగకుండ, వారా
సులు మేరలు మీఱకుండ, ♦ సూర్యాదులు దా
రులు దప్పకుండ, నెవ్వఁడు
తెలివిఁగ నియమించె నతఁడె ♦ దేవుఁడు; సుమతీ!. 2

క. తలపోసి మనుజు లీశ్వరు
నలఘు మహత్త్వంబు తెలియ ♦ నాసపడుట, యా
జలరాశిలోఁతు గనుఁగొనఁ
జలిచీమల యైన యైన ♦ చందము; సుమతీ!. 3

క. ఒరు లెవరు చూడలే దని
దురితంబులఁ సలుపఁబోకు ♦ దుష్టాత్ముఁడ వై,
నిరతము వేగన్నులతోఁ
బరమేశుఁడు చూచుచున్న ♦ వాఁడుర; సుమతీ!4.

క. ప్రత్యక్షదైవతంబులు
సత్యముగా నీకు నీదు ♦ జననీజనకుల్;
ప్రత్యహము వారిఁ గొలువుము,
నిత్యైశ్వర్యంబు నీకు ♦ నెలకొను; సుమతీ!. 5

క. జనయిత్రికంటె దైవము,
జనకునికంటెను గురుండు, ♦ జనహితరతికం
టెను మేలు, జనవిరోధం
బునకంటెను గీడు లేదు ♦ భువిలో; సుమతీ!. 6

క. ఎన్నియిడుములకు నోర్చి
నిన్నుం గని పెంచినారొ ♦ నీ తలిదండ్రుల్!
మిన్నొఱిగి మీఁదఁ బడఁగా
నున్నను, బిత్రాజ్ఞ మీఱ ♦ కుండుము; సుమతీ!. 7

క. భౌతికదేహంబునకున్
మాతాపిత లట్లు జ్ఞాన ♦ మయతనువునకున్
హేతువు గావున నొజ్జలఁ
జేతమునన్ నిలిపి భజన ♦ సేయుము; సుమతీ!. 8

క. గురుని యవగుణము లెన్నకు,
గురునింద యొనర్చువారిఁ ♦ గూడకు, మఱి యా
గురువేని చెప్పెనయ్యది
యరసి యనుష్ఠించి శ్రేయ ♦ మందుము; సుమతీ!. 9

క. జననియును జన్మభూమియు
జనకుండు జనార్దనుండు ♦ జాహ్నవియు ననన్
జను నీవైదు 'జ' కారము
లనయము సేవ్యములు సజ్జ ♦ నాళికి; సుమతీ!. 10

క. మనదేశభాష యనియును,
మనపుట్టిన దేశ మనియు, ♦ మనదేశంపుజ
జను లనియుఁ బ్రీతిఁ బొరయని
మనుజుఁడు జీవన్మృతుండు ♦ మహిలో; సుమతీ!. 11

క. హరుఁ డొదల నిడికొన్నను
హరిణాంకుఁడు కృశతవీఁడ ♦ దది యుక్తమె రా
దొర యెంతసౌమ్యుఁడైనను
పరాశ్రయము దుఃఖకరము ♦ ప్రాణికి; సుమతీ!. 12

క. పరవేదన మొకయింతయు
నెఱుఁగరు శ్రీమంతు లల ఫ ♦ ణీశుని శిరముల్
ధరక్రింద నలియు చుండఁగ,
హరి సుఖముగ నిద్రపోవు ♦ నంబుధి; సుమతీ!. 13

క. సేవావృత్తి శ్వవృత్తిగ
సేవాఁడు వచించె నాఁడొ ♦ డెఱుఁగఁడు; శుని స్వే
చ్ఛావృత్తిఁ దిరుగు, నట్టిది
సేవకునకు నెన్నఁడైనఁ ♦ జెల్లునె? సుమతీ!. 14

క. సింగమున కెవఁడొసంగెను
రంగుగ మృగరాజపద ♦ మరణ్యంబున, ను
త్తుంగబలశౌర్యశాలికి
వెంగలుల సహాయమేల ♦ వేఁడఁగ; సుమతీ!. 15

క. కాలం ద్రొక్కిన యంతన
తూలక సిగ నంట నెగయు ♦ ధూళియు మేలే,
హేళనపడి పగతురపై
నాలమునకుఁ బోని యనద ♦ కంటెను; సుమతీ!. 16

క. ప్రాణంబు లొడ్డి యైనన్
మానము కాపాడుకొనుము, ♦ మానము తొలఁగం
గా నుండినను, స్వధర్మము
మానకు, మిదె ధీరజనుల ♦ మార్గము; సుమతీ!. 17

క. వెఱవకుము మృత్యువునకున్,
వెఱవకు బాధలకు, ధరణి ♦ విభుశిక్షలకున్,
వెఱవకుము లోకనిందకు,
వెఱవుము తప్పక యధర్మ ♦ వృత్తికి, సుమతీ!. 18

క. న్యాయమునఁ బోవువానికిఁ
బాయక మృగపక్షులైన ♦ బాసట యగు, న
న్యాయపరుఁడైనవానిన్
బాయుఁ దోఁబుట్టువైన ♦ వసుమతి; సుమతీ!. 19

క. ఎది యెదిరి నీకొనర్చిన
నెద యమ్మలికమ్మునొందు ♦ నెదిరికి నీ వ
య్యది సేయకుండు; మిదియే
సదమల ధర్మోపదేశ ♦ సారము; సుమతీ!. 20

క. కీర్తికయి పాఁకులాడకు,
వర్తింపుము ధర్మ మెఱిఁగి ♦ వారకదానన్
గీర్తియయినఁ, గాకున్నను
బూర్తిగఁ బుణ్యంబునీకుఁ ♦ బొసఁగును; సుమతీ!. 21

క. ధర్మమున నిలచి, దానన్
శర్మము శాంతియును గనుటె ♦ స్వర్గము; మఱి దు
ష్కర్మంబు చేసి మనమున
నిర్మథనము నొందునదియ ♦ నిరయము; సుమతీ!. 22

క. కనకంబు గాదు, తలఁపఁగఁ
గనకాంగియుఁ గాదు, కాదు ♦ కాదంబరియున్;
మనుజులకుఁ గైపు కొలిపెడి
పెనురోగము మౌఢ్య మొకఁడె ♦ పృథ్విని; సుమతీ!. 23

క. మృగమునకు నేల ముత్యము,
లగణిత మణిదర్పణమ్ము ♦ లంధున కేలా?
తగఁ జెవిటి కేల స్వరములు,
నిగమార్థము లేల మూఢు ♦ నికి నిల? సుమతీ?. 24

క. జ్ఞానంబుకతనఁ గాదే
మానవుఁ డఖిలార్థసిద్ధి ♦ వంతుం డగుటల్;
జ్ఞానము విద్యాధీనము;
కానన్ గష్టించి విద్య ♦ గఱవుము; సుమతీ!. 25

క. ఏనుంగులు సింగంబులు
నానగములు నెలుఁగుబంట్లు ♦ వ్యాఘ్రములు నరా
ధీనంబు లగుట, యాతని
ధీనీతి మహత్త్వమంచుఁ ♦ దెలియుము; సుమతీ!. 26

క. స్నానమున మేనిముఱికియు,
జ్ఞానమున మనోమలంబు, ♦ శబ్దాగమ వి
జ్ఞానమున నుడిదోసంగులు,
పూని తొలంగించుకొనుము ♦ పూర్ణత; సుమతీ!. 27

క. ఎంతెంతచదువు చదివెద
వంతంతకొఱంత యునికి ♦ యది విశదమగున్;
ఎంతెంత యది యపూర్ణమొ
అంతంత వృథాభిమాన ♦ మడగును; సుమతీ!. 28

క. వేసమున కేమి? చాకలి
నాసించిన, వలువ లెట్టి ♦ వైన లభించున్!
భాసురమగు విద్య, చిరా
భ్యాసంబునఁ గాక యొరవు ♦ కబ్బునె? సుమతీ! 29

క. వినఁనేర్చు బధిరుఁ, డంధుఁడు
కన నేర్చున్, నడువ నేర్చు ♦ ఖంజుఁడు బళిరా!
అనవరత పరిశ్రమమున
నెనయంగాఁగాని సిద్ధి ♦ యెయ్యది? సుమతీ!. 30

క. నీకన్న నధికులం గని
శోకించిన నేమిఫలము? ♦ సుస్థిరమతివై
యాకొలఁదివాఁడ వగుటకు
వీఁకన్ యత్నింపు మీవు ♦ విసువక; సుమతీ!. 31

క. ధన మున్న, ధాన్య మున్నన్
ఘనవైభవ మున్న, శాస్త్ర ♦ కౌశల మున్నన్
గొన మొకటి లేకయుండిన,
ననయమ్ము నిరర్థకమ్ము ♦ లన్నియు; సుమతీ!. 32

క. జాతి యెది యైనఁ గానీ,
పూతచరిత్రుండు లోక ♦ పూజ్యుం డగు; దు
ర్నీతిపరుఁ డెట్టి యున్నత
జాతి జనించినను నధము ♦ జన్ముఁడ; సుమతీ!. 33

క. ప్రాఁత దని కొనకు మెదియును,
నూతనమని త్రోయఁబోకు, ♦ న్యూనాధికతల్
చేతమున నరసి, గుణసం
ఘాతం బెట నుండు దానిఁ ♦ గైకొను; సుమతీ!. 34

క. సుగుణంబు లెల్ల నొకచో
నొగి నుండునె యొక్కఁడొక్కఁ ♦ డొక్కఁడఁగాకన్?
మొగలికి ఫలములు గలవే?
తగఁ బనసకుఁ బూలు కలవె? ♦ ధారుణి; సుమతీ!. 35

క. పలుకును సత్యముగా, మఱి
పలుకు మటు ప్రియమ్ము గాఁగఁ ♦ బలుక కసత్యం
బులు ప్రియము లంచు, సత్యం
బులు పలుకకు మప్రియములు ♦ మూర్ఖత; సుమతీ!. 36

క. సత్యమునకంటె ధర్మము,
హత్యన్ గావించుకంటె ♦ నతిపాతకమున్,
ప్రత్యాశకంటె నూఱట,
మృత్యూద్ధతికంటె భయము ♦ నెయ్యది? సుమతీ!. 37

క. త ప్పొకటి చేసి, దానిం
గప్పఁగ ననృతంబు వే ఱొ ♦ కటి చెప్పినచోఁ
దప్పు ద్విగుణీకృతం బగు;
ఒప్పుకొనినఁ దొలియఘుంబు ♦ నుడుగును; సుమతీ!. 38

క. తప్పకు మాడినమాటను,
చెప్పకు మనృతంబు నెట్టి ♦ చెడువేళను, పైఁ
గప్పకుము మలినవస్త్రము,
విప్పకు మాప్తుల రహస్య ♦ వృత్తము; సుమతీ!. 39

క. భూతహితంబునకంటెను
ప్రీతికరం బొండు లేదు ♦ విను మీశునకున్,
భూతాపకృతికి మించిన
పాతకమును లేదు మర్త్య ♦ పంక్తికి; సుమతీ!. 40

క. జన్మము లని జాతర లని
పున్నెమునకు భూతకోట్లఁ ♦ బొలియింప కవి
చ్ఛిన్న సుగుణముల పెంపున
నున్నతి నార్జించి సుగతి ♦ నొందుము; సుమతీ!. 41

ఉపనిష దధ్యయనంబుల
జపములఁ దపముల సమాధి ♦ సంయమములఁ, దో
రపుఁ బుణ్య మెంత, యంతయు
నుపకారపరుండు పొందు ♦ నుఱకయ; సుమతీ!. 42

అపకారపరుల కైనను
ఉపకారము చేయుచుండు ♦ నుత్తము, లల గం
ధపుఁజెట్టు తన్ను నఱికెడి
కృపాణికకుఁ దావి గూర్చు ♦ రీతిని; సుమతీ!. 43

క్షీరములు ద్రావి, సర్పము
ఘోరంబగు విష మొసంగు; ♦ గో వన్నఁ, దృణాం
కూరము దిని క్షీరము లిడు;
నీరీతిది కుజనసుజన ♦ వృత్తము; సుమతీ!. 44

క. ఆరోగ్యమె యైశ్వర్యం
బారోగ్యమె యింద్రభోగ, ♦ మపవర్గంబున్
ఆరోగ్యమె సకలార్థము,
లారోగ్యవిహీనుజన్మ ♦ మధమము; సుమతీ!. 45

క. కాయపరిశ్రమ మింతయుఁ
జేయక, బుద్ధిశ్రమంబు ♦ చేయుట యెల్లన్
లేయిసుక నేల పై న
త్యాయతసౌధంబు కట్టు ♦ నటువలె; సుమతీ!. 46

క. ఒళ్ళు చెడఁ దిరిగి, ముప్పున
భల్లాతకసేవ బాగు ♦ పడఁ గోరుట, తా
నిల్లు దరికొనుచు నుండఁగఁ,
జల్లాఱుప బావి త్రివ్వు ♦ చందము, సుమతీ!. 47

క. ఒడలు చెడు, మతి నశించును,
విడిముడి వితవోవు, యశము ♦ వీసరపోవున్
కుడు పుడుగుఁ, గూలు మసుగడ,
యెడగులకున్ మద్యపాన ♦ మెల్లర; సుమతీ!. 48

క. కొంచెమున కేమి లెమ్మని
కొంచక కలు ద్రావవలదు; ♦ కూపంబుదరిన్
'కించిత్తు' కాలుజాఱినఁ
బంచత్వము గాక కలదె ♦ బ్రతుకును; సుమతీ!. 49

క మనవచ్చు, మనుపవచ్చుఁ,
దినవచ్చుఁ, బెట్టవచ్చు, ♦ దీనులదుఃఖం
బును దీర్పవచ్చు, ధనముం
డిన నేయదిసేయరాదు ♦ నిజముగ; సుమతీ!. 50

క. దుర్జనులయెడఁగు లోఁ త్తక,
భర్జింపక సాధుజనుల, ♦ వ్యవహారములం
దార్జవము విడక, సుఖముగ
నార్జించిన దల్పమైన ♦ నధికము; సుమతీ!. 51

క. జలభరమున జలదంబులు,
ఫలభరమునఁ బాదపములు ♦ వ్రాలును జుమ్మీ;
అలఘుమతులైనవారికి
గలిమి వినమ్రత్వ కూర్చు; ♦ కాంచుము; సుమతీ!. 52

క. పరికింప విషము విషమే
పరధనము విషంబుగాక, ♦ వసుమతి విష మొ
క్కరిఁ జంపు; పరధనంబో
పోరిపుచ్చుఁ గుటుంబమును స ♦ మూలము; సుమతీ!. 53

క. పరకాంతలఁ దల్లులఁగాఁ,
బరధనము విషంబుగాఁగఁ, బరవిహితకృతిఁ
బరమార్థముగాఁ దలఁచెడు
పురుషుం డెవఁడైన లోక ♦ పూజ్యుఁడు; సుమతీ!. 54

క. పగలిటివెంటన్ రాత్రి,
తగ రాతిరివెంటఁ బగలు, ♦ తారొక్కనుభంగిన్
సుగమువెనువెంట వగయును,
వగవెంటన్ సుగము వచ్చు ♦ వసుమతి; సుమతీ!. 55

క. బురదన్ నీరును, నీటన్
బురదయు, నిమిడికొనియున్న ♦ పోలుపున దుఃఖాం
తరమున సౌఖ్యము, సౌఖ్యాం
తరమున దుఃఖమును గలదు ♦ తథ్యము; సుమతీ!. 56

క. సిరులందు సిలుగులందున్
దిరముగ నొకరహీన యుంద్రు ♦ తేజస్వులు; భా
స్కరుఁ డుదయవేళ రక్తుఁడు;
అరసంజను గూడ నాతఁ ♦ డట్టిఁడె; సుమతీ!. 57

క. పొంగకుము మేలువచ్చినఁ,
గ్రుంగకు మటఁ గీడు తారు ♦ కొన్నన, రెంటన్
సంగంబు విడిచి, ధర్మము
సాంగోపాంగముగ నీవు ♦ సలుపుము; సుమతీ!. 58

క. తొలి చేసినకర్మంబులు
ఫలోన్ముఖము లైన, వానిఁ ♦ బాపఁగ వశమా?
విలు విడిచిన బాణము, న
వ్వల మరలుప నజునకైన ♦ వశమా? సుమతీ!. 59

క. మ్రోలం బ్రియంబు లాడుచు,
వాలాయము వెనుకఁ గార్య ♦ భంగము సేయన్
నూలుకొనుపాపకర్ముఁడు,
పాలు పయిం దోఁచు గరళ ♦ పాత్రము; సుమతీ!. 60

క. నీతులు పదివేల్ నేర్చినఁ
జేతోగతి మాఱ దెందుఁ ♦ జెనఁటులకు, యుగ
వ్రాతంబు నీట నున్నను,
రాతికి మెత్తందనంబు ♦ రాదుర; సుమతీ!. 61

క. ఉన్నతమగు స్థానంబున
నున్నంతనె నీచపురుషుఁ, ♦ డుత్తముఁ డగునా?
మిన్నంటుమేడకొనఁ గూ
ర్చున్నను, కాకంబు ఖగప ♦ రుండఔ? సుమతీ! 62

క. కఱటులకు దుష్టకార్యా
చరణంబున నేర్పు పెద్ద; ♦ సాంద్ర తమ స్సం
భరిత నిశయందు, ఘూకో
త్కరమునకున్ దృష్టి పెద్ద ♦ ధారుణి; సుమతీ!. 63

క. పా లెంత నుంచి వైనను,
హాలారసపాత్ర నున్న ♦ సర్హ్వము లగునా?
మే లైనవిద్య యైనను,
పాలసుకడనున్న, సంత ♦ పాటిదె; సుమతీ!. 64

క. అప్పు తలమీఁద నుండఁగ
విప్పుగ విభవములఁ దూఁగు ♦ విభ్రాంతుఁడు, దా
నిప్పంటుకొన్న గృహమునఁ
దప్పక నిదురించు దుర్వి ♦ దగ్ధుఁడు; సుమతీ!. 65

క. ఆలుం బిడ్డల యక్కఱ
వాలాయము తీర్పఁబాటు ♦ పడ నోపక, త
త్త్వాలు పదాలుం జదివెడు
బాలిశుఁడు గృహస్థు గాఁడు ♦ పశువుర; సుమతీ!. 66

క. ముక్తికని గేహముఁ విడి,
ప్రాక్తనవాసనల మరల ♦ భార్యాదులపై
రక్తిఁగొను ధర్మనిష్ఠా
రిక్తుఁడు, రెండిటికిఁ జెడిన ♦ రేవఁడు; సుమతీ!. 67

క. కరి పెద్ద, దానికంటెన్
గిరి పెద్ద, పయోధి దాని ♦ కిం బెద్ద, చదల్
మఱిపెద్ద దానికంటెను,
అరయఁగ నన్నిటికిఁ బెద్ద ♦ యాశయె; సుమతీ!. 68

క. శోకహత మని యెఱుంగుము
లోకం బఖిలంబు; దీని ♦ లో లవమైనన్
బోకార్ప నోపె దేసియు,
నిక్కైవడి ధన్యుఁ డౌనఁడు ♦ నిజముగ; సుమతీ!. 69

క. పనిపాట లుడిగి, యాచన
మనఁ గోరెడిసోమరులను ♦ మన్నింపకు; త
జ్జను లితరుల కష్టార్జిత
ధనమును బగటన హరింతు ♦ దస్యులు; సుమతీ!. 70

క. కుంటికి, గ్రుడ్డికిఁ, దెవులుం
గొంటుకు, ముదుసలికి, ననద ♦ కు, దరిద్రునకున్
సొం టిడక పెట్టుకొంటెను,
ఘంటాపథ మిద్ది పుణ్య ♦ గతికిని; సుమతీ!. 71

క. కలవాఁడు, త్యాగశీలత
కలవాఁడు, గుణంబు నెఱుఁగఁ ♦ గలవాఁడు, దయో
జ్జ్వలుఁ డొక్కఁడైన నుండుట,
ఫలవృక్షం బూరినడుమఁ ♦ బండుట; సుమతీ!. 72

క. బలియుం డైనను నిష్ఫలుఁ
గొలువరు జను, లలఁతి యైనఁ ♦ గొలుతురు ఫలదున్;
సలిలార్థులు వార్ధిన్ విడి
కొలనన్ గూపములఁ జేరు ♦ క్రియగా; సుమతీ!. 73

క. సిరియెంత యున్న, లోభికి
నఱిగొఱయే యనుభవాప్తి ♦ అదియెట్లన్నన్
చెఱువెంత నిండియున్నను,
కొఱమాలిన గతుకు నీళ్ళే ♦ కుక్కకు; సుమతీ!. 74

క. కాళిక పగఱం గూల్చదె?
శ్రీలక్ష్మి సమస్తరాజ ♦ సేవిత గాదే?
ఏలదె కళల సరస్వతి?
స్త్రీలేమిటఁ దక్కువైరి ♦ చెప్పుము; సుమతీ!. 75

క. అమృతంబు బాలభాషిత,
మమృతంబు ప్రియోక్తిసహిత ♦ మగు నాతిథ్యం
బమృతంబు నృపబహూకృతి,
అమృతం బనుకూల యగు కు ♦ లాంగన; సుమతీ!. 76

క. నెలతోడఁ గ్రుంకుఁ గౌముది;
జలదముతోడన్ నశించు ♦ సౌదామిని; సా
ధ్వులు పతులకు ననుగతలని
తెలుపున్ జనములును గూడఁ ♦ దిరముగ; సుమతీ!. 77

క. కులకాంత కులట యైనన్,
చెలికాఁడు కృతఘ్నుఁ డైన, ♦ సేవకుఁ డుర్విన్
బలుమాటలవాఁ డైనను,
వలవను రా వేఱునరక ♦ బాధలు; సుమతీ!. 78

క. పరసతులతో, యతులతో,
ధరణీశులతోడఁ, దల్లి ♦ దండ్రులతోడన్,
గురుయోగిజనులతోడను
పరిహాసము వలదు, చేటు ♦ వచ్చుగ; సుమతీ!. 79

క. ఏపూఁటఁ జేయఁదగుపని,
యాపూఁటనె చేయు మీ న ♦ నాలస్యముగా,
రే పన్న దేమినిశ్చయ,
మాపన్మయమైన తనువు ♦ నందును; సుమతీ!. 80

క. పోయిన ఋణంబు మరలుపఁ,
దోయజగర్భునకుఁ దరమె? ♦ తోడ్తోఁ గడలిన్
బోయి పడినట్టి నది సా
నీయము క్రమ్మఱుప నెవరు ♦ నేర్తురు? సుమతీ!. 81

క. గతమునకై వగవక, యా
యతిఁ గూర్చి దురంత చింత ♦ నందక, యది ప్ర
స్తుత, మద్ది చక్క జరపుము;
చతురమతులమార్గ మిదియె ♦ శాంతికి; సుమతీ!. 82

క. గౌరవముతోడి మనుగడ,
యారయ ఋణమైనఁ జాలు, ♦ నది లేనియెడన్
నూఱేండ్లు బ్రతికెనేనియుఁ
బూరుషుఁడా? పురుగు గాక ♦ భూమిని; సుమతీ!. 83

క. చెడుఁ గలిమి, చెడును గృహములు,
చెడు మడులును మాన్యములును, ♦ చెడు వాహనముల్,
చెడు బలము, చెడును సర్వము,
చెడనిది సత్కీర్తి యొకఁడె ♦ సిద్ధము; సుమతీ!. 84

క. ఎప్పటి కేది కావలెనో
అప్పటి కది యగు నటంచు ♦ యత్నంబు దేసన్
జప్పపడకు; విత్తనిపాల
మెప్పొటను బండ దనుచు ♦ నెఱుఁగుము; సుమతీ!. 85

క. కలదో లేదో యదృష్టము
తెలియఁగా రాదు బ్రహ్మ ♦ దేవుని కయినన్
గల దనుకొని యత్నింపుము;
ఫల మెట్టిది యైనఁ, జింత ♦ పడకుము; సుమతీ!. 86

క. కానిపనికై కడంగకు,
మూసినపని వీడకుము ని ♦ రుత్సాహమునన్.
పూనకుము దీర్ఘచింతను,
కానక దొరఁకొనకు మెట్టి ♦ కార్యము; సుమతీ!. 87

క. బాలుండు చెప్పెనేనియుఁ,
బోలినపలు కైన వీటి ♦ పుచ్చుక కొనుమా;
ఫాలాక్షుఁ డూని చెప్పినఁ
బోలనిమా టైనఁ గొనకు ♦ బుద్ధిని; సుమతీ!. 88

క. పరులకు బోధించెదు నెడఁ
బరమేష్ఠిసమాను లెల్ల ♦ వారును; మఱి స్వా
చరణంబు వేళ వచ్చినఁ
బరమేష్ఠియు జగముతోడి ♦ వాఁడుర; సుమతీ!. 89

క. అతికామంబున రావణుఁ,
డతిగర్వముచేత నహుషుఁ, ♦ డతిదాన సము
న్నతి బలియుఁ జెడిరి కావున
'అతి' వర్జింపంగ వలయు ♦ నన్నిట, సుమతీ!. 90

క. ధనికులకు చేతు లొగ్గకు,
ధనహీనుల నెందు నెల్లి ♦ దము సేయుప, మీా
వను వెఱిఁగి యెల్లవారల
ప్రణయంబు గడింపు ముచిత ♦ వర్తన; సుమతీ!. 91

క. చెలిమిన్ మే లొనరింపరు,
చెలికారము మాన నెగ్గు ♦ సేయుదురు కడున్,
బలయుతు లగుదుష్టులతోఁ
జెలి మైనను, వైర మైనఁ ♦ జేటుకె; సుమతీ!. 92

క. చన వధిక మైన, మన్నన
పోనుగు పడుట యేమివింత? ♦ బోయపడఁతి చం
దనతరుకాష్ఠంబుల నిం
ధనములఁ గావించు మఱియు ♦ నగమున; సుమతీ!. 93

క. వితరణ విహీను విత్తము
ప్రతిభాన విహీను చండ ♦ పాండిత్యంబున్
ధృతిహీను బాహుబలమును
వితథము లీమూఁడు నెట్టి ♦ వేళను; సుమతీ!. 94

క. లలితములు విరులకంటెను,
కులిశంబునకంటె మిగులఁ ♦ క్రూరములు, మహా
త్ముల చిత్తవృత్తు లిట్టివి,
కలనాళ్ళన్ గానినాళ్ళఁ ♦ క్రమముగ; సుమతీ!. 95

క. అసదృశ పండితుఁ డైనను,
వెస, నాశ్రయహీనుఁ డైన ♦ వెలుఁగం గలఁడే?
మిసిమిగల రత్న మైనను,
బసిఁడిం బొదువంగఁబడక ♦ వఱలునె? సుమతీ!. 96

క. చెఱకునకు ఫలము, చందన
తరువునకున్ విరులు, కమ్మఁ ♦ దావి పసిఁడికిన్
వరమతులకు నైశ్వర్యము,
పొరయింపని బ్రహ్మ యెంత ♦ మూఢుఁడొ! సుమతీ!. 97

క. కవికంటె బోధకరుఁడును,
రవికంటెన్ దీప్తికరుఁడు ♦ రాకాధవళ
చ్ఛవికంటె హర్షకరుఁడును,
భువనత్రయమందు లేరు ♦ పోలఁగ; సుమతీ!. 98

క. కాకిం గసరఁగ నేలా?
కోకిలమును గొసర నేల ♦ కూయు మటంచున్?
లోకంబు మెచ్చుకవితా
పాకం బది పూర్వపుణ్య ♦ ఫలముర; సుమతీ!. 99

క. తరువు పువు పూచెనేనియుఁ,
బరిమళము వెలార్ప గంధ ♦ వాహుఁడు వలదా?
వరకవితకైన, సరసుల
కరుణాప్తింగాక వ్యాప్తి ♦ కలదే? సుమతీ!. 100

క. కవిలోక విశ్రుతుఁడు, సా
ధువు, సుబ్రహ్మణ్యశర్మ ♦ దుర్భాన్వయ సం
భవుఁ డిది భవద్ధితార్థము
చవిపుట్ట రచించె, దీనిఁ జదువుము; సుమతీ!. 101



# లఘుటీక.



1. శ్రీదంబులు = సంపద నిచ్చునవి, భవపాశచ్ఛేదంబులు = సంసారబంధములఁ ద్రెంచునవి, చిత్తాంబురుహము = మనఃకమలము, ఆమోదము=సంతోషము; తావి. ప్రాజ్ఞుడు=బుద్ధిమంతుఁడు.

2. ఇల=భూమి, వారాసులు=సముద్రములు.

3. అలఘుమహత్త్వంబు=గొప్పప్రభావము.

5. ప్రత్యహము=ప్రతిదినము.

6. జనహితరతి=జనులకు మేలుసేయుటయం దాసక్తి.

8. భౌతిక=పంచభూతమయ మైన, తనువు = శరీరము, చేతము = హృదయము.

9. అవగుణములు = దుర్గుణములు, అనుష్ఠించి = ఆచరించి,చేసి, శ్రేయము = మేలు.

10. జాహ్నవి = గంగానది, సేవ్యములు = సేవింపఁదగినవి, ఆళి = సముదాయము.

11. పొరయని = పొందని, జీవన్మృతుండు = బ్రతికియుండియుఁ జచ్చినవాఁడు.

12. హరుఁడు = శివుఁడు, జొదల = శిరస్సు, హరిణాంకుఁడు = చంద్రుఁడు, యుక్తము కా = న్యాయ్యమే కదా,

సౌమ్యుఁడు = మంచివాఁడు, పరాశ్రియము = ఇతరుల నాశ్రియించి యుండుట.

13. వేదన = బాధ, ఫణీశుఁడు = శేషుఁడు, అంబుధి = సముద్రము.

14. శ్వవృత్తి = కుక్కయొక్కవృత్తి; కొలువు శుని = కుక్క, స్వేచ్ఛావృత్తి = ఇష్టము వచ్చినట్లు.

15. పదము = స్థానము, ఉత్తుంగ = పొడవైన, అధికమైన, వెంగలులు = పనికిమాలినవారు.

16. తూలక = వెనుకఁబడక, పగతురు = శత్రులు, ఆలము = యుద్ధము, అనద = దిక్కుమాలినవాఁడు.

17. ఒడ్డుట = అడ్డముపెట్టుట.

19. బాసట = సహాయము. వసుమతి = భూమి.

20. ఉమ్మలికము = దుఃఖము, ఎదిరి = ఎదురు (రూపాంతరము), ఎదుటివాఁడు. సదమల = శ్రేష్ఠమై, పరిశుద్ధమైన,

21. వారక = ఉడుగక.

22. శర్మము = సంతోషము, నిర్మథనము = ఆందోళనము, నిరయము = నరకము.

23. కనకాంగి = స్త్రీ, కాదంబరి = మద్యము, మౌఢ్యము = మూఢత్వము.

24. అగణిత = లెక్కలేని. సారములు = స్వర్గములు, నిగమార్థములు = వేదార్థములు.

25. అఖిలార్థ సిద్ధిమంతుఁడు = సకల సిద్ధులుకలవాఁడు.

26. ధీనీతిమహత్త్వము = బుద్ధియొక్కయు నీతి యొక్కయు పరిభావము.

27. శబ్దాగమ = వ్యాకరణశాస్త్రముయొక్క; నుడిదోసంగులు = వాగ్దోషములు.

28. అభిమానము = గర్వము.

30. ఖంజుఁడు = కుంటివాఁడు, అనవరత = ఎడతెగని, ఎనయుట = పొందుట.

31. కొలఁది = పాటి, వీఁక = పూనిక.

32. కౌశలము = నేర్పు.

33. పూతచరిత్రుఁడు = పవిత్రమైన నడవడిక కలవాఁడు, అధమజన్ముఁడు = నీచజాతివాఁడు.

34. న్యూనాధికతల్ = కొలఁది గొప్పలు,
చేతము = మనస్సు, సంఘాతము = కూడిక.

35. కాకన్ = ఇది ద్రుతప్రకృతికముగాఁ బ్రయోగింపఁబడినది.

37. ప్రత్యాశ = మేలుకలుగు ననునాశ,
ఊఱట = ఆశ్వాసము, తృప్తి. ఉద్ధతి = విజృంభణము.

38. ద్విగుణీకృతము= రెండింతలు, అఘము = పాపము

39. ఆప్తులు= స్నేహితులు, వృత్తము = వృత్తాంతము.

41. అవిచ్ఛిన్న = ఎడతెగని.

42. ఉపనిషదధ్యయనము=వేదాంతములు చదువుట, సంయమము = మనస్సును నియమించుట మొదలగునవి. తోరపు = అధికమగు.

43. కృపాణిక = కత్తి.

44. తృణాంకూరము = గడ్డిమొలక.
కుజనుఁడు = దుర్జనుఁడు.

45. అపవర్గము = మోక్షము.

46. బుద్ధిశ్రమంబు = మొదటితోఁ బని, లే = లేఁత, అత్యాయతసౌధము = మిక్కిలి విశాలమైన మేడ.

47. ఒళ్ళు = శరీరము, ముప్పున = ముసలితనమున, భల్లాతక సేవ = జీడితోఁ జేయబడినమందు దినుట.

48. విడిముడి = ధనము, పీసరపోవును = చెడిపోవును, కుడుపు = తిండి, మనుగడ = జీవనము, ఎడరు = ఆపద, ఎల్ల = హద్దు.

49. కొంచక = ఉడుగక, పంచత్వము = చావు.

51. ఆర్జవము = ధర్మము (ఋజుభావము)

52. జలదము = మేఘము, పాదపము = చెట్టు, అలఘుమతులు = గొప్పమనస్సు గలవారు.

55. సుగము = సుఖము, వగ = దుఃఖము.

56. ఇరవుకొని = నెలకొని, అంతరము = లోపల.

57. సిలుగులు = ఆపదలు, వహి = రీతి, రక్తుఁడు = రాగముకలవాఁడు (ఎఱ్ఱనివాఁడు), అరసంజ = సాయంకాలము, అట్టేఁడు = అట్టివాఁడు.

58. సంగము = సంబంధము, సాంగోపాంగముగ = పూర్తిగా.

59. ఫలోన్ముఖము = ఫలమిచ్చుటకు సిద్ధమైనది, విలు విడిచిన _ ధనువునుండి వెడలిన, అజుఁడు = బ్రహ్మదేవుఁడు

60. మ్రోల = ఎదుట, నూలుకోను = ఫూను, పాలు పయిం దోఁచుగరళపాత్రము = పయోముఖవిషకుంభము.

61. చేతోగతి=మనస్సుయొక్క మార్గము, యుగవ్రాతము _ పెక్కుయుగముల కాలము.

62. ఖగవరుఁడు _ గరుత్మంతుఁడు.

63. కఱటులు = పెద్దవారు, సాంద్రితమస్సంభరితనిశ = దట్టమైనచీఁకటి గలరాత్రి, ఘూకోత్కరము=గుడ్లగూబలగుంపు

64. హాలారసపాత్ర = కల్లుకుండ,
పాలసుఁడు = దుష్టుఁడు.

65. విష్వగ = విశేషముగ, విభ్రాంతుడు = భ్రాంతి కొన్నవాఁడు, దుర్విదగ్ధుఁడు = తెలివిగల దనుకొనువాఁడు.

66. బాలిశుఁడు = మూర్ఖుఁడు.

67. ప్రాక్తన = మునుపటి, రిక్తుఁడు = లేనివాఁడు, రేవఁడు = చాకలి (శ. ర.)

68. చదలు = ఆకాశము.

69. లవము = ఇంచుక.

70. మన = బ్రదుక, దస్యులు = దొంగలు.

71. తెప్పలుగొంటు = రోగి, సొంటు = తప్పు, ఘంటాపథము = రాజమార్గము.

73. అలత్తి = స్వల్పుఁడు, సలిలార్థులు = నీరు కావలసినవారు. కూపము = బావి.

74. అఱగొఱ = అల్పము, కొంచెము.

75. పగఱు = శత్రువులు.

76. భాషితము = మాట, ప్రియోక్తి = మంచి మాట, నృపబహూకృతి = రాజసమ్మానము.

77. నెల = చంద్రుఁడు; కౌముది = వెన్నెల, సౌదామని = మెఱపుతీఁగె, జడములు = ప్రాణములేనివి.

78. కులట = అంకుటాలు.

80. ఆపన్మయము = ఆపదలతో నిండినది.

81. తోయజగర్భుఁడు = బ్రహ్మ,
పానీయము = జలము.

82. ఆయతి = భవిష్యత్కాలము,
దురంత = అంతములేని.

85. ఎప్పాటను = ఏవిధముచేతను.

87. కానక = విచారింపక.

89. పరమేష్ఠి = బ్రహ్మ.

90. సమున్నతి = అతిశయము.

91. ఎల్లిదము = ఎగతాళి, ప్రణయము = మైత్రి.

39. పొనుగుపడుట = నశించుట, పడఁతి = ఆఁడుది, కాష్ఠంబులు = కొయ్యలు, నగము = పర్వతము.

94. విత్తము = ధనము, ప్రతిభానము = తెలివి, చండ = తీక్ష్ణ, ధృతి = ధైర్యము, వితథము = వ్యర్థము.

95. కులిశము = వజ్రము, కలనాళ్ళన్ = సంపదలందు, కానినాఁడు = ప్రతికూలసమయము.

96. అసదృశ = సమానములేని, వెస = వేగ, ఆశ్రయము = ప్రాపు.

98. రాకాధవళచ్ఛవి = పున్నమనాఁటి చంద్రుఁడు, దీప్తి = ప్రకాశము, భువనత్రయము = మూఁడులోకములు.

99. పాకము = పరిపాకము.

100. గంధవాహుఁడు = గాలి,

వెలార్ప = వ్యాపింపఁజేయుటకు.

101. భవద్ధితార్థము = నీమేలుకొఱకు.



Ramakrishna Press, Nellore

పుస్తకములు వలయువారు:—

దుర్భా సుబ్రహ్మణ్యశర్మ,
ఆంధ్రభాషోపన్యాసకుఁడు, కళాశాల,
నెల్లూరు.

అనివార్యయువలయును.

రామకృష్ణ ప్రెస్, నెల్లూరు.

